# స్వభావము మరచిపోవుచున్న దక్షిణాంధ్రులు

(సాధు వరదరాజం పంతులుగారు)

చోళపాండ్య సింహాసనములపై తెలుగువల యునని నాయకరాజులు దక్షిణదేశమునకుగుమి కిరి, తమప్రతిభావిశేషములనుజూపి అతికౌశల ముతో రాజకార్యములను నిర్వహింపవలయునని నియోగిమంత్రులుజూరిపడిరి.అసమానపాండిత్యవి శేషమునుజూపి అరవలకు ఆంధ్రసారస్వతమునుకు చిచూపవలయునని పండితోత్తములు పరుగిడిరి. తేనిమలొలుకు తెలుగుపాటలపాడి వినులసం గీతములపతాకములను నిలపెట్టవలయునని గా యకోత్తములుఅరుదెంచిరి. సేతుపరియంతము ద క్షిణదేశమంతయు అభ్రంకషగోపుర సుందరాయల చేనలంకరించి ఆంధ్రకళాకౌశలమును చిరస్థాయి గాజేయవలయునని శిల్పులునుజేవచ్చిరి. నాయ కరాజులపోషణక్రింద సుఖముగాకాలముకడపవ చ్చునని వేలకొలదిజనులుదక్షిణమునకు తరలివచ్చి రి, తుదకుఆంధ్రసరస్వతీదేవియు. వీణాపుస్తక పాణియైవలసవచ్చినట్లున్నది. అందరుఆనంద ములో నూతనఉత్సాహముతో ప్రయాణమైవ చ్చిరి-

దివ్యప్రబంధములురచించిన పండితోత్తముల సంతతి నేడుఅక్షరములనుగూడమరచినది! నన్న య్యపోతనాది మహాకవుల పురాణేతిహాసములను జదివి ఆనందించుచున్నవారు, నేడువారిపవిత్రనా మములనైననెరుగకున్నారు అతికోమలమగు వీరి మాతృభాష నేడుతమిళశబ్దములతో మిళితమై అసహ్యకరముగా కన్పట్టుచున్నది, చల్లగాలిపుల వినుచేసి భక్తిచేతన్మయత్వము నొందించిన త్యా గరాజాదుల తెలుగుతేటసంగీతములు నేడుఅర్థ ము తెలియకుండ దుష్టోచ్చారణలతో పాడబడు చున్నవి. జయలక్ష్మినిబంధించిన నాయకరాజుల దుర్గములు నేడు శిథిలములై తెలివితప్పిపడియు న్నవి.

దక్షిణజిల్లాలలో ఆంధ్రులజనసంఖ్య సామా న్యమైనదికాదు. చెంగల్పట్టులో 3½ లక్షలును, ఉత్తరార్కాటులో 3½లక్షలును,దక్షిణార్కా టలో 2లక్షలును, సేలములో నాలుగున్నర ల క్షలును, కోయంబత్తూరులో 3నర లక్షలును, తంజావూరులో 30వేలును తిరుచ్చినాపల్లిలో 2నర లక్షలును, మధురలో 3లక్షలును, రామ నాథపురంలో 2లక్షలును, తిన్నవెల్లిలో 2 ల క్షలును, పుదుకోట్టలో 70 వేలును, నీలగిరి లో 70వేలును, మొత్తము మున్నదిలక్షలకుపైబ డిన గొప్పఆంధ్రసంఘము స్థిరపడియున్నది- మ ధురలోజూచితిమేని సాధారణముగా అద్వితీయ మిరులుగూడ తెలుగుభాషను అర్థముచేసుకొనగల రనిన దక్షిణాంధ్రదేశమున తెలుగుభాష ఎంత లోతుగానాటుకొనిపోయియున్నదో తెలిసికొన వచ్చును. ఇదిమాత్రమేగాదు అరవజిల్లాల గెజె టియర్లు మాన్యువల్సు ప్రతిదానిలోను తెలు గుభాషనుగురించియు, కొనియాడినారు.

తెలుగుభాషతమిళదేశమున మిక్కిలి వ్యాపక మైనభాషగాయున్నదనియు దక్షిణమున 100-కి 30మంది అరవవారు తెలుగుమాట్లాడగల గ్రామ ములున్నవనియు రాష్ట్రభాషకు 2-వ స్థానము లోను భిన్నజాతులవారిభాషకు అగ్రస్థానమును, అలంకరించుచున్నదనియు తెలిపియుండ గొప్ప అభిప్రాయమును గాంచితిమేని మనప్రభుత్వము వారుకూడ ఎంతియభిప్రాయముతో ఈభాషా వ్యాపకమును గమనించియున్నారని తెలిసికొన వచ్చును. ఇదేగాక, తెలుగుభాష అరవదేశమున నెంత లోతుగాపాదుకొని పోయియున్నదను విషయమును బట్టిజూచునపుడు నేటికినమున ఈద క్షిణమున ఆంధ్రులసంఘముఎంతో గౌరవము కలి గియున్నదని చెప్పకతప్పదు

ఇంతటిగొప్పసంఘములో ఏయేజాతి వారు న్నారుఅనుట గమనించవలసినవిషయమై యున్న ది. ఇచ్చటి తెలుగుజాతివారిలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్ర మాదిగవారువరకు సకల వర్ణాశ్రమ ధర్మములను, చేపట్టినవారుమాత్రమేగాక చేతిప నులుతెలిసిన కమసాలిమంగలి మొదలగువారును మంగలిచాకలిమొదలగుకులమువారును అనేక వేల సంఘలలో ఈదక్షిణమున స్థిరపడియున్నారు

పూర్వము వీరి పూర్వీకులు ఆచరించుచుండున ట్టి ఆచారవ్యవహారములనే వీరు ఆచరించుచున్నా రు పండుగలు పర్వములన్నియు ఆంధ్రసాంప్ర దాయములను అనుసరించినవే. వైష్ణవసిద్ధాంతము గలవారుతప్ప తక్కినవారందరును శ్రీశృంగేరి మఠాధిపతులగు శ్రీశ్రీశ్రీ జగద్గురు శ్రీశంక రాచార్యులవారికి లోపడినవారై తమఆచారవ్య వహారములను జరపించుకొనుచున్నారు- వైష్ణవులు శ్రీ రామానుజాచార్యులవారి వైష్ణవసిద్ధాంతము గలవారినియు వ్యత్యాసభావములు ఏవియు గాను రావు-ఇచ్చట తెలుగువారు తమ తెలుగుసంవత్స రాది, భోగిపండుగ, నాగులచవితి, గౌరీదపంచ మి, వివాహసందర్భమున నాగవల్లిమహూర్తము ను, అవాడు నల్లపూసలధారణము మొదలగు ప్ర త్యేకమైన అనేకఆంధ్ర సంప్రదాయములను కలిగి యున్నారు.

మరియు ఇచ్చటి తెలుగువారికర్మానుష్ఠానము లన్నియు ఆంధ్రపౌరోహిత్యము క్రిందనే జరుగుచు న్నవి-మరియు ఒకవైదికగోష్ఠికిచెందిన ములకినా టివారును మరియొక్కవైదికగోష్ఠికిచెందిన వెల నాటివారును ఒండొరులతో సంబంధబాంధవ్య ములనుకలుపుకొనుటలేదు? ఇపుడిపుడు కొందరు దక్షిణాంధ్రవైదికులుచ్చియు, కొందరు తెలుగు రాజ్యములకువెళ్ళియు సంబంధ బాంధవ్యములను కుదుర్చుకొనుచున్నారు, ఇదియెంతో శుభకరమై నవిషయము-కాని అమార్గమునందు అంతవిరివిగా జరుగుటకు తగినప్రోత్సాహము ఉన్నంతమేరకు ఇం కనుకలుగలేదు-ఈవిషయమునందు ఉత్తరాంధ్రసో దరులు కొంతవరకు ముందంజవేయవలెను, ఇచ్చ టివారి మిక్కిలికుతూహలముతో తమపూర్వపు బాంధవ్యములను కలుపుకొనుటకు సిద్ధమైయుండ క తప్పదు.

ఇచ్చటి తెలుగువారందరును, విశేషముగాధన వంతులుగాకపోయినను చాల ఉదారులై విశాల దృష్టిగలవారని చెప్పవచ్చును,

ఇచ్చటి జమీందారులందరును మన కమ్మనా యుళ్ళవంశస్థులే. ఎట్టియాపురం కురవికుళం, ఇళయరసనేందల్, శెవ్వల్పట్టి,వడకరై దొడ్డప్ప నాయకనూర్, ఆవారం, ఎట్టిచేరి నాయకనూ రు, పెరయూర్, కొప్పత్తూరు, సాంతియూర్, తిరియూరు, మొదలగు జమీనులన్నియు, తెలు గు జమీందార్లవే.

దక్షిణాంధ్రులపరితాపకరమైనస్థితులకన్నిటికి ఇచ్చటిఆంధ్రులమాతృభాష క్షీణించుటయే కారణ ము-భాష, ఒకజాతియొక్క నాగరికతనుకొలుచు యంత్రమని చెప్పవచ్చును. మరియుఅది జాతియొ క్క జీవితమును ప్రతిబింబింపచేయుఅద్దమని చెప్ప వచ్చును-ఇట్టిసిద్ధాంతమును మనము అంగీకరించితి మేని, ఇచ్చటితెలుగువారిమాతృభాష క్షీణించిన తోడనే, వీరిపూర్వపుగౌరవము న్నియు క్షీణిం చి, వీరిజీవితసౌందర్యము అన్నియు గూడ కుంటు పడినదని చెప్పకతప్పదు. ఎంతటి చదువుకొన్నవా రైననుగూడ, మాతృభాషా విజ్ఞానము లేనివారై, ఆంధ్రప్రపంచమెరుగక పక్షులంబోలి ఆహారము కొరకుతిరుగుచును ఆ ఆహారము భుజించిపిమ్మట నిద్రించుటయు, పరిపాటియై యున్నది.

ఇదిచాల విపరీతమైన స్థితిని ప్రకటించుచున్న ది! అవిపరీతమును అరికట్టకపోయినయెడల, మన ఆంధ్రప్రపంచమునకే ముప్పుకలుగకతప్పదు- ము మ్మాటికినిదప్పదు. మూడుకోట్ల జనముగల ఒకే ఆంధ్రసంఘములో ఒకటిన్నరకోటి జనులు పరరా ష్ట్రములలోచిక్కుకొని క్రిందపడి పోయియు న్నారు.

కాబట్టి సర్వరాష్ట్రాంధ్రులుచేయవలసినది ప్ర చారము- ప్రచారము-కుదుర్చుకొనవలెను డబ్బు లేనిది ఎట్టికార్యమునుచేయుటకు వీలుపడజాలదు. మనమందరికి మాతృసంస్థగానుండు ఆంధ్రమహాస భ ఈపనిపూనుకొనవలయును, ప్రతిసంవత్సరము మీటింగులుజరిపించిన మాత్రమున ప్రయోజనపడ జాలదు.

[ఆంధ్రపత్రిక]

# నాగార్జునుడు

ఆంధ్రావనిలో బౌద్ధమత ప్రభావముగూర్చి ముచ్చటించునపుడు బౌద్ధభిక్షు శిఖామణియు తత్త్వజ్ఞపుంగవుడును మహాయానసిద్ధాంత సంస్థాప కుడునునగు నాగార్జున బోధిసత్త్వుని మరువ జాలము

అతడు సిద్ధపురుషుడైయుండుటచే సంతతాన మగుశక్తి నాతనికుండెననియు ప్రకృతిశాస్త్రజ్ఞాన పారీణుడైయుండి జ్యోతిషశాస్త్రములలో నేగాక ఓషధులుమూలికలుగూర్చ యతివిశిష్టజ్ఞానము గలి యుండెననియు ఆయుర్వేదములో ధన్వంతరి యంతవాడైయుండుటయేగాక "సుశ్రుత"మును పరిశోధించి "కక్షపుటతంత్ర" "ఆరోగ్యమం జరి"యను సద్గ్రంథములను రచియించెననియు తెలియవచ్చుచున్నది నేత్రచికిత్సలో నాడుమహాపుర షునిమందు చీనాదేశములలో నతివిస్తారముగ నుప యోగింపబడుచుండెను- అనేకజాడ్యములకొరకని ఔషధయోగములు గ్రంథములలో వ్రాయబడి దేశమునందంతటను స్థాపించబడెననియు విష చికిత్సలో నాతిఅద్వితీయుడనికూడ తెలియవచ్చు చున్నది-నాగార్జునబోధిసత్త్వుడు "రసరత్నాకరు త్నాకరము"అను వైద్యగ్రంథమురసమును బ్రజము లుమున్నగువాని శుద్ధివిషయముగ వ్రాసెను- ఈమహా పురుషుడు క్షరణముచేయుటయు భస్మముగం డ యాయుచేయుటయు కనుగొని లోహములగూర్చి యుపారమైనజ్ఞానమును సంపాదించి, భారతీయ రసాయనశాస్త్రమునకు మూలాధారముకల్పించె నని పండితులూహించుచున్నారు భారతీయరసా యనశాస్త్రపితామహుడైన నాగార్జునుడు, స్వతం త్రస్వతంత్రుడైయుండి ప్రకృతిశాస్త్రమునకును, ఆయుర్వేదమునకునుబ్రహ్మయై సర్వవిజ్ఞానమునకు నదిస్వరూపుడైయుండి, అనేక తత్త్వగ్రంథములను రచియించెను ఈమహాపురుషునిగ్రంథము లనేక ములు నశియించినవి ఇప్పటికి మిగిలియున్నవి చీనాపండితులుతమభాషలోనికి తర్జుమాచేయుట వలననె నిలిచియున్నవి చీనావారుచేసిన మహ త్తరకార్యమునుమనము తగినటుల ప్రశంసింప లేము.

, ఈమహాపురుషుడుఇపుడు నాగార్జునకొండయను ప్రదేశములోనే జీవించియుండెను, అతనికాల మునుగూర్చి పండితులలో నభిప్రాయభేదమున్న ది నాగార్జునుడు క్రీ॥శ రెండవశతాబ్దములోనుండి నటులచెప్పుటకు కారణములు గాన్పించుచున్నవి. ఈతడు "కనిష్క" చక్రవర్తికి సమకాలీనుడు. నాగార్జునునిశిష్యుడైన ఆర్యదేవుడు, క్రీ॥శ మూడవ శతాబ్దములో సింహళద్వీపపరిపాలకుడైన "వొ హారతిస్స" "అభయ" అనువారలకు సమకాలీను డని "మహావంశము"లో చెప్పబడినది ఈమహాత్ము నికాలములో ఆంధ్రదేశములో, శిల్పము, తర్క దిశాస్త్రములు, తత్త్వసిద్ధాంతములు ఆయుర్వేదశా మ రసాయనశాస్త్రము ఒక్కమాటలో ప్రబోధ పర్యంతము సంగ్రహము చెందినది ఆయుగము ఆంధ్ర ప్రబోధచరిత్రలో సువర్ణయుగమని చెప్పక తప్పదు నాగార్జునునితరువాత వానిశిష్యకోటిలో విఖ్యాతిచెందినవారలు "ఆర్యదేవ "భావవివేక" "దిఙ్నాగ" "ధర్మపాల"అనుభిక్షువులు,

(ఆంధ్రపత్రిక)

